# ఆంధ్రమహిళ

సంపుటి 1. సంచిక 12.



ANDHRA
MAHILA SABHA
MYLAPORE, MADRAS.

# ANDHRA MAHILA

1-11-44.

Annas 4 Per Copy




సంపుటి 1. 1 నవంబరు 1944 సంచిక 12



# రాష్ట్ర మహిళాసభ కర్తవ్యం

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ నవంబరులో సమావేశ మౌతుం దనివార్త. ఈ వార్షిక సమావేశం యీమారు గుంటూరు మహిళల ఆతిధ్యాన్న జరుగుతుంది. మహిళా సభకు జీవం పోసి, చైతన్యం కలిగించి, రాష్ట్ర గౌరవాన్ని నిలబెట్టడానికి మనం పూనుకోవాలి. అధ్యక్షోపన్యాసానికి తలలూపి, తీర్మానాకి చేతు లెత్తి కర్తవ్యం సమాప్తి అని సంతృప్తిపడ్తే గుంటూరు సభ కూడా వార్షికమే అయిపోతుంది—యిన్నేళ్లూ జరుగుతూన్నట్టే!

అఖిలభారత మహిళాసభ అధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి ఆంధ్ర జిల్లాలలో ప్రచారం చేస్తుందని వార్త. తన జీవితాన్ని స్త్రీ సంఘ శ్రేయస్సు కోసం, జాతీయాభ్యున్నతి కోసం ధార పోస్తున్న కమలాదేవికి ఆంధ్రమహిళలు సుస్వాగతం యిస్తారు. ఆమెపై మనకున్న గౌరవాన్నీ, ప్రేమనీ ప్రకటిస్తాం. అంత మటుకే—మారాష్ట్రంలో గూడా మహిళోద్యమం ముందంజ వేస్తోందని గాని, సంఘాన్ని కలవరించే సమస్యలలో రాష్ట్ర మహిళాసభ జోక్యం కల్పించుకుని సేవ చేయకలుగు తోందని గాని చెప్పలేం. కార్య నివేదనలేని స్వాగతపత్రం—కమలాదేవి ఎంత హర్షిస్తుందో!

రాయలసీమలోని ఆర్తనాదాలు మహిళా మణుల చెవి సోక లేదు. వంగరాష్ట్రంలో వలె రాయలసీమలో గూడ కరవు తాండవించినా రాష్ట్రమహిళాసభ—అంటే మనం—చెక్కు చెదరలేదు. వంగరాష్ట్ర మహిళాసభ కృషిఫలితంగా అక్కడ శిశుపోషణ కేంద్రాలు, స్త్రీ శరణాలయాలు వెలిసాయి. కాని, యిక్కడో—క్షుద్బాధచే దహించుకు పోతున్న వుదరాలకి రొట్టెల నందియ్య లేకపోయినా, మానం కాపాడుకోమని చిరిగిన బట్టలని పోగు చేయలేక పోయింది—సంకల్పించు కోనేనాలేదు—రాష్ట్ర మహిళాసభ. కరవులూ, తుపానులూ, వరదలూ, ప్రళయాలూ—యివి సంఘాన్ని పరీక్షచేసి సేవాధర్మాన్ని బోధించడానికి సంభవిస్తాం టాయి అన్నదే నిజమైతే మనం విధికృతానికి కూడా అతీతులం అన్నమాట.

మహిళల శ్రేయస్సుకు, విజ్ఞానాభి వృద్ధికి ఏర్పరచబడ్డ కస్తూర్బా నిధిసేకరణ మన సోదరుల కృషిపై ఆధారపడింది. మహిళోద్యమానికి పునాదిగా వుపకరించబోయే కస్తూర్బా స్మారక కేంద్రాల నిర్మాణానికి ఆంధ్ర మహిళలు జోక్యం కల్పించుకో లేదు—వారి రాష్ట్రసంఘం రీత్యా. జీవం ధారపోసి స్త్రీ జాతికి గౌరవ ప్రపత్తులను చేకూర్చిన మాతా కస్తూర్బాకు స్మారక చిహ్నం పురుషులు నిర్మించారు—స్త్రీలు చోద్యం చూస్తోంటే. ఇదీ మన రాష్ట్ర మహిళాసభ 1943-44 చరిత్ర. అధ్యక్షురాలు కమలాదేవికి సమర్పించ బోయే కార్యనివేదిక!

అయితే—మన రాష్ట్రంలో మహిళో ద్యమానికి ఆస్కారం లేదనుకోడం వట్టిమాట. 30-32 నాటి చరిత్ర ఓమారు నెమరుకు తెచ్చుకుంటే తెలుగునాడు ఏరాష్ట్రానికీ తీసిపోదు అని అవగతం ఔతుంది. అప్పటి దేశసేవికా సంఘాలు రాజకీయ పోరాటానికే నియుక్తమైతే కావచ్చు; కాని, ప్రభుత్వాన్నే కలవరపరచి మహాతేజస్సుకల అగ్నిని రగుల్కొల్ప గలిగిన ఆ దేశసేవికల శక్తి యింకా మాటుమడగ లేదు. ఆ శక్తిని కేంద్రీకరించి కార్యప్రణాళిక నేర్పరచి జాతీయాభ్యున్నతికి వినియోగించడం లోనే వుంది రాష్ట్ర సంఘంయొక్క ప్రజ్ఞ. జాతీయ పోరాటానికి ముందంజ వేసిన దువ్వూరి సుబ్బమ్మ—ఆంధ్ర పితామహురాలు—సనాతన విద్యాలయం తీర్చి దిద్దుతోంది. లక్ష్మీ బాయమ్మ, కనకమ్మ కామేశ్వరమ్మ గార్లు మహిళా విద్యాలయాలు నడుపుతున్నారు.

ముఖచిత్రం: "సుమాంజలి" చిత్రకారిణి: బి. ఎల్. వెరోనికా

ఆంధ్ర మహిళా సభ దసరా ఉత్సవాల ఎగ్జిబిషన్‌లో ప్రథమ బహుమానం పొందిన 'లైన్‌డ్రాయింగ్' చిత్రం.

భారతీదేవి పల్లెపడుచులకు ప్రబోధం చేస్తోంది. వీరంతా సమకూడి రాష్ట్ర సంఘాని కోదారి చూపెడ్తే మహిళా లోకం కృతజ్ఞురాలుగా వుంటుంది. 30-32 జాతీయోద్యమంలో అనేక యిడుమలపలోనై త్యాగశక్తిని ప్రదర్శించి ఆంధ్రరాష్ట్రానికి గౌరవస్థానాన్ని చేకూర్చిన నారీమణులు విద్యాలయాలో, సంఘాలో స్థాపించి నిర్మాణ కార్యక్రమం సాగిస్తూనే వున్నారు. కాని, వీరికృషి వ్యక్తి ప్రాయంగానే వుండి ఆపల్లెకో, ఆపట్టణానికో మాత్రం సంబంధం యేర్పరచుకుని వుంది. రాష్ట్రీయ సంఘం వీరందరి సహకారం అభిలషించి సమకూర్చ గలిగితే ఆంధ్రదేశంలో మహిళోద్యమం తిరిగి ప్రజ్వరిల్లుతుంది. బాలసరస్వతీ స్త్రీసమాజం, వైశ్యసేవా సదనం, శారదానికేతనం, కస్తూరీదేవి పాఠశాల, ఆంధ్రమహిళా సభ—యివి జాతీయాదర్శంతో మనరాష్ట్రంలో నిరంతర కృషి చేస్తూన్న కొన్ని సంస్థలు. వీటికి తోడుగా ప్రతీ పట్టణంలోనూ స్త్రీ సంఘాలనీ, క్లబ్బులనీ వున్నాయి. ఈ సంస్థల ప్రతినిధులను కేంద్రసంఘం ఆహ్వానించి వారి సేవను స్వీకరిస్తే ఆంధ్రరాష్ట్ర మహిళాసభ తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చ గలుగుతుంది. లేదా, మరుసటి సంవత్సరం కూడా రాష్ట్రసంఘం తన చరిత్రలో యింకో శూన్య ప్రకరణాన్ని ప్రచురించే అవస్థకు లోనౌతుంది.

★

# జోహార్ !

౧

అఖిలలోకాంతరవ్యాప్త సమరవహ్ని, నార్పజాల్ దివ్యామృతాంబుధరము
బహుమార్గగమన తత్పరజాతి తురగాల, నొకగతినడుపింప నోర్చుకౌతు
యుద్ధపరిశ్రాంత యోధమయజగాన, శాంతిసుధలఁజల్లఁజాలు వేల్పు
ద్రవ్యవాదోద్రిక్తధవళజాతికి నవ్య, సందేశమీఁగల్గు చతురబుద్ధి
సకలరాష్ట్ర చక్రసమితిఁద్రిప్పఁగలుగు
మూలచక్ర మాత్మపూతహస్త
మందుఁదాలిచి జగదవనకార్యమొనర్చు
ఆమహాత్ము గాంధి కాత్మనతులు.

౨

కల్వరియోగి శాక్యమునిప్రముఖులయ, హింసాగుణంబు సాధించుకొంటె
గోఖ్లే, తిలక్ముఖ్యకోవిదవర్యుల, రాజ్యాంగతత్వం బలర్చుకొంటె
శంకరరామానుజముఖప్రవక్తల, వేదాంతభావంబు చేఁదికొంటె
హిందూమతప్రధానేత్త్ర సమానశీల, మనుసరణీయమం చాఁదుకొంటె
పరమపూతమా భారతావనికెగాదు
సకలనాగరకప్రపంచమున కీవె
యుత్తమశకపూరుషుఁ డౌదువో మహాత్మ !
ఈశ్వరుఁడునీకు బ్రహ్మాయువిచ్చుఁగాక ॥

ఎం. వేం. ల. నరసింహారావు.

★

# కొత్తలోకం



శ్రీ ఆ. వెంకటరమణరావు.

మనం అంతా ఒక యుగసంధిలో విచిత్రమయిన విప్లవ వాతావరణంలో జీవిస్తున్నాం. సాంఘిక విలువలు అతి వేగంతో మారిపోతున్నాయి. లోకం అంతా ఒక అంతులేని వ్యవధానంతో ఆదుర్దాతో పరుగెడుతోంది. మనకళ్ల ముందు మళ్లీ యింకొక మహాయుద్ధం సాగిపోతోంది. ఏమిటిదంతా! ఎందుకోసం?

మన మతం ప్రజాస్వామ్యసిద్ధాంతం. అందులో పరస్పర భ్రాతృత్వభావం. 'మీ సుఖమే నాసుఖం' అనుకుంటూ 'నువ్వు బతికి నీతోపాటు యితరులని బతకనీ' అనే ఆర్య సిద్ధాంతం అంటే మనకి గౌరవం. (ఇలాంటి చల్లని కబుర్లు వింటూ మనం బతికే నాలుగు రోజులు యిలాగే గడుపుకో కలిగితే) ఎంత బావుంటుంది అనుకున్నాం. ప్రతి దేశంలోనూ, అధికారవర్గాలు యివే అసలు సరియయిన ఆశయాలు అన్నాయి. ఆచరణలోమటుకు అర్థంలేని వర్గభేదాలకి అంతంలేని ప్రాధాన్యాన్ని యిచ్చి, ఏ కొద్దిమంది సౌఖ్యంకోసమో ప్రజా బాహుళ్యంయొక్క సౌఖ్యాన్ని బలిచేసి పారేశారు. దానితో ఊపిరి ఆడని పరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రజలో ఒక తిరుగుబాటు లేచింది. ఒక సచేతనమయిన అసంతృప్తి బయలుదేరింది. ప్రస్తుత సాంఘిక విధానం పరమ దరిద్రస్థితిలో పడిపోయింది; ఇది మారితేనే గాని మనకి ముక్తి లేదన్న విషయం పూర్తిగా అర్థమయింది. అయితే దీనికి విప్లవం కావాలా? బహుశా అవసరమే. అయితే యీ జరుగుతూన్న యుద్ధం యిది సాధిస్తుందా? అనుమానం. యుద్ధం చేసే దెందుకో? మానవుల హక్కులని రక్షించి వారి మానవత్వానికి అర్థం కల్పించడానికే చేస్తున్నాం అంటున్నారే, యీ ఆశయాలు నెరవేరక పోతాయా అంటే మనం మన పూర్వపు అనుభవం, ప్రస్తుత పరిస్థితులు జాగ్రత్తగా ఆలోచించుకోవాలి.

ఈ అంసంతృప్తి మన కాలంలోనే, యీనాడే బయలుదేరిందికాదు. ఈ ఆవేదన మన తండ్రుల తరంలోనే ఆరంభమయింది. ప్రపంచకాన్ని మరామ్మతు చేస్తేనేకాని వీలులేదన్న ప్రయత్నాలు పాతికేళ్ల క్రిందటే ఒక నాగరికత పేరిట ప్రారంభించారు. దేశానికి, దేశానికి మధ్య అల్లిబిల్లిగా అల్లుకు పోయిన తగాదాలకి సెరాజివో నడి వీధుల్లో పట్టపగలు జరిగిన అల్బర్టు ప్రిన్సు హత్యాపచారం, రగులుతోన్న పిడకల వెతకి నిప్పు అంటించింది. దానితో యూరపు అంతా ఒక్క సారి భగ్గునమండి, కాలి, కాలి, నాశనమయి పోయింది. ఆ శ్మశాన వాటికల్లో పీనుగుల కుప్పలు తీయించిన తరువాత, రక్త ప్రవాహాలు ఎండిన తరువాత, కూలి పోగా మిగిలిన యిళ్ళ కుప్పల వెనకాల కూర్చొని, జరిగిన యుద్ధం ఎందుకో జ్ఞాపకం తెచ్చుకొని, మళ్లా అలాంటి ప్రమాదం రాకుండా కొన్ని గట్టి ప్రయత్నాలు చేయాలని వారనుకున్నారు, బతికున్న పెద్దలతో. పరువూ ప్రతిష్ఠా వుండి తలనెరిసిన పెద్దలకి నలుగురికీ కబురంపారు. వారంతా కలిసి కూర్చొని, యిలాంటి అపాయాలు లేకుండా అంతా సుఖంగా జీవించే కొత్తలోకాన్ని ఒకటి నిర్మించడానికి ఆరంభించారు. అప్పటి కప్పుడే, యుద్ధంముందు చావు బతుకుల మధ్య వేలాడుతున్న మానవత్వం పూర్తిగా చచ్చి పోయింది. ఈ చచ్చిపోయిన మనుష్యులు తయారుచేసిన నిర్జీవపు శ్మశాన శాంతి, బతికి బాగుపడదలచుకొనే మనుష్యులకోసం చేసే సంధి ప్రయత్నాలని వెక్కిరిస్తున్నట్లు అనిపించింది. అయితేమాత్రం ఏమి ఆగుతుంది? చేరిన నలుగురూ, తలొక అభిప్రాయమును అందిచ్చారు. ప్రెసిడెంటు విల్సను తన పద్నాలుగు బైరాగి చిటికలు సరఫరాచేశాడు. గబగబా, భవిష్యత్ ప్రపంచ నిర్మాణానికి పునాదులు కట్టడం ప్రారంభించారు. 'ఆ యింట్లోనే మేమంతా కలసి శాశ్వతంగా శాంతంగా బతకాలి అని అంటున్నాడుకదా! మా మీద, పెద్దలు మీరు కొంచెం కనికారం చూపించండి. ఊపిరి ఆడని గదుల్లో మమ్మల్ని కూల్చి పారేస్తే మేం బతికేది ఎలాగ? అదిగాక మానెత్తిన మేము భరించలేని అప్పులు పెట్టి, మాకు వుండడానికి వీలులేని పరిస్థితులు సృష్టిస్తే ఎలాగ?' అని జర్మనీలాంటి అప్పటి చిన్నజాతులు గోలపెట్టాయి. పెద్దలంతా ఎలా నిర్ణయిస్తే అదే న్యాయం గాని దానికి సమాధానం లేదన్నారు. దానితో శాంతి

ఏర్పడుతుందా? ఆవిధంగా శాంతి కోసం చేసిన యుద్ధం, చేసిన శాంతి, అంతకంటె ప్రమాదకరమయిన యింకో యుద్ధమునకు దిట్టమయిన పునాదులు వేసింది. జాతికి, జాతికీ ఆనాడు కొత్తగా పుట్టిన అసహ్యాలూ, ద్వేషాలు పెరిగి పెద్దవై, ఒకళ్ళనొకళ్ళని నరుక్కోడానికి మళ్లా రంగంలోకి దుమికించాయి. యుద్ధమునకు పూర్వం, యుద్ధ కాలంలోనూ ప్రకటించిన ఆశయాల సంగతి యుద్ధంతోటీ మరిచిపోవడంతోటీ, యీనాటికి మళ్లా, యీ వుపద్రవం తప్పిందికాదు.

మళ్లా ఒక కొత్తలోకం లోనికిమారి, ఒక కొత్త జీవిత విధానాన్ని నిర్మించుకొని, ప్రజా జీవితాన్ని అత్యంత సౌఖ్యదాయకంగా, శాంతి ప్రదంగా జరుపుకోవాలని ఉబలాట మారంభమయింది. ఈ యుద్ధం తెచ్చిపెట్టిన అశాంతి, యీ యుద్ధానికి మూలకారణమయిన అశాంతి పూర్తిగా పోగొట్టి పరిస్తితులు తిరిగి యీవిధంగా మారకుండా గట్టి ప్రయత్నాలు చేయాలన్న వ్యామోహం బలంగా ప్రాకింది. ఈపని రేపు యీయుద్ధం అయిపోగానే రౌను బల్లచుట్టూ మూగే పెద్దల భుజాలమీద వేస్తారు. వారేంచేస్తారో చూడాలి.

కొత్తలోకం నిర్మాణానికి అనేక ప్లానులు వేస్తున్నారు. ప్రతిదేశంలోనూ, ప్రతి రాష్ట్రంలోనూ, యుద్ధం అయిపోగానే జరిగే మొదటిపని ఏమీ అంటే యింకో కొత్త జీవిత విధానాన్ని ఏర్పరచుకోవడం. దానికోసం యిప్పటినుంచి ప్రారంభంచేసి పని మొదలుపెట్టాలి అని ఆందోళన బయలుదేరింది.

అయితే యీ కొత్తలోకం ఎలా వుండాలి? అదే మన సమస్య. నేటి పరిస్థితులు పూర్తిగా పోవాలి. కొత్త వాతావరణంలో, కొత్త జీవిత విధానంలో ప్రతి దేశంలోనూ ప్రజలు దారిద్ర్యం లేకుండా సుఖంగా జీవించాలి. ప్రతి మనిషికి తిండి కావాలి, గుడ్డ కావాలి, పని కావాలి, ఉండడానికి నీడ కావాలి. అభివృద్ధిలోకి వచ్చి, తన యిరుగు పొరుగున జరుగుతూన్న సాంఘికాచారాలమీద, ప్రభుత్వ విధానంమీద తన విమర్శన ఏదో చెప్పకలిగి, తన పౌరసత్వపు ధర్మానికి అర్ధం కల్పించుకోవాలంటే అతనికి విజ్ఞానం కావాలి. అందుకు అతడు చదువుకో కలగాలి. అందుకు అతనికి అవకాశాలు యివ్వాలి. అతడు చెప్పగలచుకొన్నది గ్రంథరూపంగానో, బహిరంగ సభా మూలకంగానో, పత్రికామూలంగానో ప్రకటింపడానికి అభ్యంతరాలు పోవాలి; అతని హక్కులకి సంపూర్ణమయిన అర్థం వుండాలి. సమత, స్వాతంత్ర్యం అన్నవి సిద్ధాంతాలుగా మిగిలిపోవడం కాకుండా, ప్రతి వ్యక్తికి, తన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని వికసింపచేసికోడానికి తగిన అవకాశాలు నిర్మించి, నేడు అర్థం లేని సామాజిక స్థానంవల్ల సంక్రమించే సంకెళ్ల మధ్య యిరుక్కొని పైకి రాలేక అడుగునబడి, నలిగి, కృశించి నశించే పరిస్థితులు పోవాలి. భర్తృహరి చెప్పినట్లు 'యస్యాస్తి విత్తం స నరః కులీనా స పండితః సంశ్రితవాన్ గుణజ్ఞః న ఏవవక్తా, స చ దర్శనాయః సర్వే గుణాః కాంచన మాశ్రయంతి' అని కళ్లుమూసుకొనే కాలపు రోజులు కావివి. Materialists సిద్ధాంతం ప్రపంచాన్ని మొట్టి తన పెద్దతనాన్ని స్థాపించుకొనే రోజులివి. ఇదంతా సంఘంలో జీవిత విధానం మాట. ఇంక జాతులదగ్గరికి, జాతీయ ప్రభుత్వాల దగ్గరికి పోతాం. ప్రతీజాతి, తన సాంప్రదాయలకి గర్వపడవచ్చు. దేశీయాభిమానం అభివృద్ధిపరుస్తూ, తన ప్రజని ఒక పురోగమనంలో, ఉన్నత పథంలోకి నడిపించుకోవలసిందే. కాని, తన జాతీయతలోనుంచి పుట్టిన స్వదేశాభిమానాన్ని, విదేశ ద్వేషంలోకి మార్చి, దౌర్జన్యంలోకి దిగకుండా చూచుకోవాలి. అటువంటి కట్టుబాటులు వున్ననాడే అన్నిజాతులు భద్రంగా బతక కలుగుతాయి. యుద్ధపు వ్యామోహం అంటే, కొనుక్కొన్న పసుపుకత్తె ప్రణయకలాపం అంత నిజాయితి అయింది అంటాడు లాస్కి. ఎంత ధన నష్టం! ఎంత జన నష్టం! కళ్లుపోయి, కాళ్లుపోయి, ఆజన్మాంతం అహోరాత్రాలు అవస్థపడుతూ చావలేక, బతకలేక సంధిగ్ధంలో చెమ్మగిల్లిన కళ్లతో చీదరించుకొని బతికేది ఎంతమంది! ప్రత్యేకజాతిసోదరభావంతో బతకడం నేర్చుకొంటే ఎంత నయం! వచ్చే శాంతిసమయంలోనైనా పెద్దజాతులు చిన్నజాతులని తిమింగలంలా విషం మింగడం మాన్పుతారా అంటే అదీ అనుమానంగానే వుంది. ఆశయాలతో మనకి వైరం లేదు. ఆచరణ పరిస్థితులు చూస్తే, భవిష్యత్తు భయంగానే వుంది. ఇన్నాళ్లు అధికారం చలాయించిన పెద్దలకి ఆ తిమ్మిరి పోలేదు. మొన్న డంబ

ర్టన్ ఓక్సులో రాబోయే లోకం సంగతి ఆలోచిస్తూ, ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా, రష్యాలు మేమంతా తక్కిన చిన్న జాతులని జాగ్రత్తగా చూస్తూంటాం అన్నాయి. అయితే యీ పెద్దలు ఏం మాట్లాడుతున్నారో వారికే అర్థం కాలేదని మనం అనుకోక తప్పదు. ఇంక అట్లాంటిక్ ఛార్టరు మాకు నప్పుతుందా అంటె చర్చిలుగారు యింత వరకు 'ఊ' అనిగాని 'ఆ' అనిగాని ఏమీ అనలేదు. అంటా డన్న ఆశాలేదు.

నిజంగా లోకం బాగుపడి మనం అంతా సుఖపడాలంటే మన జీవిత దృక్పథం మారాలి. లివింగ్‌స్టన్ చెప్పినట్లు యీ నాడు మనకు అత్యవసరమయింది తాత్వికదృష్టి. ప్రపంచ శాంతి ఏనాడూ అలెగ్జాండరు, నెపోలియనులాంటి యోధుల చేతుల్లోంచి రాలేదు. ఇప్పుడురాదు. జీసను, బుద్ధుడే ప్రపంచ శాంతి స్థాపనకి శాశ్వత ప్రవక్తలు. ఈ భావాలే లో జీర్ణం చేసుకోవాలి. ఇవే తల్లులు బిడ్డలకి ఉగ్గుపాలు పొయ్యాలి. జాతియొక్క అభ్యుదయం తల్లులమీద ఆ పడి వుంటుంది. ప్రపంచ కల్యాణం విశ్వజనని చేతుల్లో ప్రతీ తల్లి తన సంతానాన్ని ఉత్కృష్టమయిన ఆశ కోసం పెంచి, దేశ విమోచనకోసం జీవితం ధారపోయక ధైర్యసాహసాలు యిచ్చి, స్వతంత్ర వాతావరణములో ఆ త్మికశాంతితో తన దారిని పోకలిగేమార్గం చూపాలి. మన ఆదేశం! ఇది తల్లులు సాగించాలి. బిడ్డలు నిర్మించ అప్పుడు లోకం శాంతించాలి. అదే కొత్తలోకం!



## ఆధునిక యుద్ధ 'బీభత్సం'

యుద్ధం ఇప్పుడు మహా భయంకరంగా అనేక రంగాలలో జరుగుతూవుంది. ఆధునిక యుద్ధ పరికరాలైన టాంకు మర ఫిరంగులు, బాంబరు విమానాలు, గాలికోట విమానాలు, టార్పెడోలు, జలాంతర్గాములు—ఇలా అనేక యంత్ర సాధనా మహా మారణహోమం సాగుతూవుంది. ఈ ప్రపంచ సంగ్రామ ఫలితంగా సంభవిస్తున్న నష్టానికి పరిమితిలేదు. ఆ న అంకెలలో కంటె, కొన్ని విషయాలతో పోల్చి చూసుకుంటే దానిలోని వాస్తవికత చక్కగా స్ఫురిస్తుంది.

ఘోస్ట్ పెరేడ్: మానవ జీవితాలు సమిధ ప్రాయాలు ఈ మారణ హోమానికి

గత యూరోప్ సంగ్రామంలో మరణించిన బ్రిటిష్ సైనికుల జీవుల్ని వరుసకు 20 మంది వంతున న్యూయార్ ఫిఫ్త్ ఎవెన్యూ గుండా ఉదయం నుంచి సాయంకాలం వరకూ నడిచి వెళ్ళమంటే, అందరూ పూర్తిగా ఆ స్థానం చేరుక డానికి పదిరోజులు పట్టుతుంది. ఐరోపా సంగ్రామంలో మృతినొందిన సంఖ్య 3,74,99,336. ఆ యుద్ధంలో మరణిం వారందరి జీవులూ లేచివచ్చి అలావిన్యాసం జరపాలంటే నాలుగు మాసాలు పట్టుతుంది. ఈ వినోదం సాగించడా ఇటు మిత్రరాజ్యాలూ అటు అక్షరాజ్యాలూ కలిసి 200,00,00,00,000 డాలర్లను అగ్నిపాలు చేసాయి.

ధనం—జాతీయ నిర్మాణానికి హులిశక్కి- విధ్వంసనానికి అనంతం

మూడురోజులకు యుద్ధానికిఆయిన వ్యయంతో అమెరికాలో పనామా కాలువను నిర్మించ వచ్చు.

ఎనిమిది రోజులకైన వ్యయం చూస్తే బోస్టన్ లాంటి పట్నాన్ని సృష్టించవచ్చు.

అమెరికాలోని కార్మికు లందరికీ పదిమాసాల పాటుఇచ్చే వేతనంతో రెండురోజులు మాత్రమే యుద్ధం చెర వచ్చునని తేలింది.

1913 లో అమెరికాలో వున్న పాఠశాల లన్నిటిని నిర్మించడాని కైన మొత్తంతో ఒకవారం సమరం జ వచ్చునని వ్యక్తమయింది.

ఒక ఆధునిక క్రూయిజరు నౌకను నిర్మించడానికి ఎంత వ్యయం ఔతుందో అంత మొత్తంతో నిర్మితమైన కళాశా భవనంగాని, విశ్వవిద్యాలయ భవనంగాని అమెరికాలోలేదు.

అప్పటినుంచీ విమానాలు, ఫిరంగులు, విషవాయువులు, టాంకులు, విధ్వంసక శతఘ్నులు, రెక్కల బాంబు మొదలైనవాటిని గురించి పరిశోధనలు జరుగుతూ వచ్చాయి.

ఇప్పుడు వీటితో అతి భయద్రమైన కదనం ప్రజ్వరిల్లు తున్నది. దీనిలో కలుగుతున్న నష్టాలను చూస్తే క్రింద యుద్ధం చిన్నపిల్లల ఆటతో సమానంగా కనిపిస్తుంది.

("థామస్స్ ఇంటర్‌నేషనల్ పొలిటిక్సు" నుం

# పురుషులు

శ్రీమతి వి. రంగాదేవిగారు

పురుష స్వభావం మొత్తంమీద చూసుకుంటే సోదరి రంగాదేవిగారు ఉల్లేఖించినంతగా లోపభూయిష్టం కాదు. అలా అని అనలో కొంతవరకూ సత్యం లేకపోలేదు. రచన కొంచెం ఘాటుగావున్నా రసవంతంగానే వున్నది. ఇక చదవండి. సం॥

ాడితే స్త్రీ స్వభావమంటారు. అతికోమలమం ండిన పదార్థం యెట్లున్నప్పటికీ అమృతంలాగా ంటారు. అలా అనకుంటే కోమలభావం కుడ ండదంటారు. స్త్రీని యెప్పుడూ పొగడుతూ వుం రు. భార్య చూస్తూ వుండగా పరస్త్రీతో యేదేనా నా మండిపడుతుందంటారు. ఎందుకొచ్చిన సోద ?

షులకంత నైతికబుద్ధి యున్నదా?—భార్య పర తో మాట్లాడుట చూచెనేని పటపట పండ్లునూరి, ాడి, యెదలో కుమిలి, మదిలో పొగిలి, గుమ్మ కాలు పెడుతూ గునిసి, భోజనం దగ్గర బుసబుసలాడి రుసరుసలాడి క్రాపుదువ్వక, కాలరు సర్దక, ట్టక కాలం గడుపుతాడు భర్త. అంత భార్య వచ్చి డీ యీరోజిలా వున్నారు? మానసిక బాధలు మిమ్ముల మసలనీక పట్టినవా? యేమిటో తెలియ అని అంటే—అన్నదే తడవుగా, అల్లాగా! సంగనాచివే. యేమీ యెరుగవు నీవు? మీ జాతి కలు యెక్కడకి పోతుంది? యేదైనా చేయగలరు! టుల నటించనూ గలరు?' అంటూ పురాణ స్త్రీ ర్పణఖ, పూర్వసి మొదలగువారిని యేకరువు పెడ ఈ పురాణ శ్రవణమంతా దేనికండి, అసలు విష తేల్చరాదండీ అంటే—సాయంత్రం నీవు తో మాట్లాడుట నా కండ్లారా చూస్తినిగదా? యెరుగనటుల సంచరించదవేమే? అంటారు.

మూకారణం, మీ హడావుడికీ, ఆర్భాటానికీ యీ గానికిన్నీ! యేమిటి విషయమంటే నేనే చేస్తాను -వినండి. అయితే—వాళ్ల చెల్లెలు మొన్న పరీక్షల వచ్చి శెలవులిట గడిపినది గదూ-ఆమె పరీక్షన్యైనదా? ఎం.బి.బి.ఎస్. చదువుటకు వెళ్లునని విన్నాను నిజ అని అడిగితినండీ-అందు నాకుకూడా, కాస్తో కూస్తో జ్ఞానము గలదాన నగుటవల్లనూ మీరు గనిలో స్త్రీ స్వాతంత్ర్యముమీద యిచ్చే యుపన్యాసములవల్లనూ-అలా అడుగుటకు సాహసించినాను. అయితే మీదంతా నేతిబీరకాయ స్వాతంత్ర్యమన్నమాట!' అంటుంది. గృహాకల్లోలం అంతరిస్తుందా...? స్త్రీలనైతే మహోన్నతంగా పొగడుటో-తెగడుటో-పొగడుటా తెగడుటా రెండుకూడానో-మరి యేమోగాని దస్తాలకొలదీ కాగితాలు ఖరాబుచేస్తారు. నిజం ఆలోచిస్తే పురుషుల బండారం-పురాణమవుతుంది వ్రాస్తే.

గుమ్మములో నిలబడ్డ మెల్లకంటి గృహిణికి వీధిలో నిలబడ్డ పురుషుని వూసే లేకున్నప్పటికీ, ఆ చూపులు అతనినే చూసిందని పలుసార్లు అటనే తిరిగి పరిభవమందే పురుషులే?

రైలుస్టేషన్లయందు ప్రయాణోన్ముఖులగు స్త్రీలనుగాంచి వారిదగ్గరకుబోయి యేవూరుమీది! యెచ్చటికి బోయెదరు? యిలాగ ప్రశ్నిస్తారు. ఎందుకొచ్చిన ప్రశ్నలివి? కుడిచి కూర్చుంటే కుదురు తక్కువై కుమ్మరి పురుగుల్లాగా కుళ్లగించుటకాని. పదిమంది స్త్రీలు గనుక కానిపిస్తే యిక నీ పురుషులు-క్రాపులు దువ్వుతారు. కాలరు సర్దుతారు. యెప్పుడూ యెరుగకున్నప్పటికీ "విల్స్" సిగరెట్లు నోట్లో పెడతారు. సిరావున్నా లేకున్నా "పెన" జేబులో పెడతారు. వారంరోజుల క్రిందటిదైనా దినపత్రిక దర్జాగా చేత్తో పడతారు. బిళ్లగోచీ బిగిస్తారు. వెనుదిరుగుచూ మడమలు జూచుకొంటూ నీటుగా అక్కడక్కడే దేశసంచారము జేస్తారు. అందుబాటులో కొస్తారు. అంతా మా రాధలాగా వుందని వొకడూ, మా సువర్ణలాగా వుందని వొకడూ, మా సీతలాగా వుందని వొకడూ, యిలాగ వాళ్లల్లో వాళ్లే లాగుతూ వుంటారు—యెందుకొచ్చిన సంభాషణ? మనిషినిపోలిన మనిషియుండదా? అందులో కొంచెము సత్వాంత్ర భావాలుగల యువతి సోషల్గా

మాట్లాడిందా-యికను జూచుకోండి వీళ్ల భావాలు వియత్పథమున విహరిస్తాయి. పదిమందిలో మాత్రం పరువు మర్యాదలతోనే అంత విజ్ఞానవతియైన మహిళను-అజ్ఞానంగా సంసారబంధాల్లో బంధించి అధోగతి పాలుచేస్తున్నారంటారు. ఒంటరిగా వాళ్లల్లో వాళ్లుమాత్రం-పురుషుడనేభావం లేకనే తెగబడి సంభాషణ సాగించింది యేమిటిరో—యేదో...అని అనుకుంటూ యెన్నెన్ని విధాలగానో కలలుకంటారు.

సినిమాలు చూచుటకొచ్చిన స్త్రీలను సూటీపోటీగా యెన్నో మాటలు. పైగా స్త్రీలు కూర్చున్నవైపునకొచ్చి దగ్గరగా అడ్డుగావున్న పరదా అనుకుని కూర్చుంటారు. మిగతా హాలంతా ఖాళీగావున్నా సరే. కూర్చున్నవాళ్లు కులాసాగా జూచిపోతారా అంటే-వాళ్ల ప్రకృతి అట్టిది గాదుగా-చూపులకు నవనాగరికుల్లాగా కనుపించువారే-పశువులా అన్నంతగా సంభాషణ సాగిస్తారు. పురుష స్వభావమే యిట్టిదా? లేక పురుష స్వభావానికి పురుగుపుట్టిందా అన్న సందేహము జిజ్ఞాసగల ప్రతి జీవికి తప్పక కల్గుతుంది?



## సుభద్రార్జునీయం
(నృత్య నాటిక)



సీత, శకుంతల
(ఆంధ్రమహిళాసభ విద్యార్థినులు)

కథానిక :

# నమస్తే

"భాస్కర్"

నాకూ ఆమె ఎవరో పరిచయస్తురాల్లాగే కనిపించింది. ఆ అమ్మాయి నావైపే చూడడం, అందులోనూ చిన్న మందహాసం ఆమె వదనంలో కనిపించడం—నేను సాహసించి బస్సు స్టాపింగు వైపు నెమ్మదిగా నడిచాను. పది గజాల దూరం వుందనగానే నవ్వుతూ 'నమస్తే' అంది. నేనూ లేని నవ్వు తెచ్చుకుని 'నమస్తే' అన్నాను, 'ఎటికెట్' పాటిస్తూ.

ప్రక్కనే నిలబడివున్న అరవాయన చిన్న విషపు నవ్వు నవ్వేడు. కారణం నాకూ మొదట అర్థం కాలేదు. కాని, తలెత్తి చూసేసరికి పెద్ద సినిమా ఎడ్వర్టైజుమెంటు. వెలింగ్టన్ టాకీసులో 'నమస్తే' పిక్చరు. ప్రతిమాదాస్ గుప్త వాస్తికి నమస్కారం చేస్తున్న చిత్రం. అప్పుడు బోధపడింది. అరవాయిన బుర్ర ఎంతవరకూ పోయిందో.

అంతే, ప్రజలు—వాళ్లకి చేతకాని పనులు ఎదటి వాళ్లు సాధిస్తున్నా, వాళ్లకి లేని శక్తులు ఎదటి వాళ్లలో కనిపించినా, ఏదో వేళాకోళంగా చూడ్డం పరిపాటయి పోయింది. కాస్త దగ్గరగా వెళ్లి చూస్తినిగదా—శాంత. ఆరేళ్లలో ఎంత పోల్చుకోలేకుండా మారిపోయింది! ఆ పక్కనున్న చిన్న పిల్లెవరు?

"ఏమిటి శాంతా! ఎన్నాళ్లకు కనిపించావు. ఎంత మారిపోయావు" అన్నాను.

"మీరుమాత్రం మారిపోలేదేమిటి."

"మొగవాళ్లకన్నా, ఆడవాళ్లలో ఎక్కువ మార్పు కనిపిస్తుంది" అంటూ ప్రక్కనున్న చిన్నపిల్లవైపు కొంటెగా చూశాను.

"ఇక్కడెందుకున్నావు? ఈ అమ్మాయి........."

శాంతకళ్లు చెమ్మగిల్లాయి. అలాగే రెండు నిమిషాలు ఆమె కళ్లల్లోకి చూస్తూ నిలబడి పోయాను. ధోరణి మార్చుదామని "అక్కయ్య ఎక్కడవుంది" అన్నాను.

"వాళ్లు ఇక్కడే వున్నారు. బావకి ఇక్కడే పనయింది. నేను వాళ్ల యింట్లోనే వుంటున్నా"నంది.

"అమ్మాయి పేరు"

"సరోజ"

"ఇప్పుడెక్కడికి వెడుతున్నావు?"

"మాంబళం వెళ్లి సాయంత్రానికి వస్తాను. సాయంత్రం కనిపిస్తారా? ఇక్కడే బ్రాడీస్ రోడ్డులో ఉన్నాము." అని ఇంటి నెంబరు ఇచ్చింది. ఇంతలో బస్సు రావడంతోనే పిల్లని తీసుకుని, ఎక్కి వెళ్లిపోయింది. రిక్షావాడలాగే నిలబడివున్నాడు ఇంతసేపు. వాడికేం, పేచీపెట్టి రెండణాలు సంపాదించవచ్చు.

నా కళ్లముందు పెరిగిన శాంత, నాదగ్గర చదువుకున్న శాంత, పదిహేను ఏళ్లకి పెళ్లికావడం, అప్పుడే వైధవ్యం అనుభవించిడం—నేను నమ్మలేకపోయాను. శాంతకి ఇలాంటి రాతవస్తుందని కలలోనైనా అనుకోలేదు. ఆమె భావి జీవితాన్ని గురించి ఎన్ని ఆశాసౌధాలు నిర్మించాను. ఆ అల్లరి, ఆ కొంటెతనం, ఏమయిపోయింది. పెళ్లికాక పోతేనేం. అయి ఏమి అనుభవించింది.

సాయంత్రం నెంబరు వెతుక్కుంటూ వాళ్లింటికి వెళ్లాను. "ఎప్పుడొచ్చావు? రా" అంటూ జానకి ఎదురు వచ్చింది. శాంత ఇంకా రాలేదు. బావా లేనట్లున్నాడు ఇంట్లో. నిజానికి జానకి నాకంటె కొంచెం చిన్నదయినా, ఆమెదగ్గర నేనే చిన్నలాగ కనిపిస్తాను. అందుచేతే నాకు శాంత దగ్గరున్నా చనువు జానకిదగ్గర లేకపోయేది. జానకిని చిన్నప్పటినుంచీ 'అక్కా' అనే పిలిచేవాడిని.

"ఈవేళే వచ్చాను. ఇందాకా శాంత కనిపించింది. మీరంతా ఇక్కడున్నారని చెప్పింది" అన్నాను.

"చూశావా దాని ఖర్మ మెలా కాలిపోయిందో"

శాంత మొగుడుకి రంగూన్‌లో బర్మాషెల్ కంపెనీలో ఉద్యోగం అవటం, శాంతని తీసువెళ్లటం, అక్కడ సరూ పుట్టడం, జపానువాళ్లు రంగూన్ బాంబుచెయ్యటం, ఏక్టివు సర్వీసులో అతను గాయపడటం, హాస్పటలులో మరణించటం, కళ్లంట నీళ్లు పెట్టుకుంటూ చెప్పింది.

"మరి వీళ్ళని ఎవరు తీసుకువచ్చారు"

"అతని స్నేహితులు రంగూన్‌నుంచి వచ్చేస్తూ, భద్రంగా శాంతని, పిల్లని ఇక్కడికి చేర్చారు. దాని కష్టాలు తలుచుకుంటే గుండె నీరయి పోతుంది."

ఈ కథంతా వింటూ కుర్చీలో కూలబడి వున్నాను. ఇరవై ఏళ్లది, తన రెండేళ్ల కూతురితో, రంగూన్‌లో ఎంత బాధపడిందో, ఎలా బ్రతికి వచ్చిందో తలుచుకుంటే భయమేసింది.

ఇంతలో శాంత సరూని తీసుకునివచ్చింది. నాదగ్గర కూర్చుని తన కష్టాలు వెలపోసుకుంటూ, కంపెనివారు తనకి నెలకి 50 రూపాయిలు పంపుతున్నారని, ఇన్సూరెన్సు ద్వారా మూడువేలు వచ్చేయని చెప్పింది.

“డబ్బు జాగ్రత్తగా చూసుకుంటున్నావా?”

“బావే బ్యాంకులో వేశాడు. ఏదైనా రూపాయిలు బావకే ఇచ్చేస్తున్నా. ఇంకెవరున్నారు నాకు.” అంది.

బావ వచ్చేడు. ఒకసారి వెనక పరిచయం అయినా కొత్తగానే చూశాడు. జానకి తిరిగి పరిచయం చేసింది. అయినా ఏదో అనుమానంగానే చూడడం మొదలుపెట్టాడు. రాత్రి భోజనాలదగ్గర కూడా, శాంత నాతో అంత చనువుగా వుండటం బావకి ఇష్టం లేనట్టు కనిపించింది. మర్నాడు నేనూ, శాంతా సినిమాకు వెడతామంటే, అర్ధాంగీకారంతో, అక్కమా పార్టీ కాబట్టి ‘యస్’ అన్నాడు. “రాత్రి, బ్లాకౌటు! జాగ్రత్తగా దిగబెట్టాలి సుమా” అని హెచ్చరించాడు. సినిమానుంచి తిరిగి వస్తుంటే, తనకి చదువుకోవాలని వుందనీ, అలాగైనా కొంత దుఃఖం మరచిపోవడానికి అవకాశం వుంటుందనీ, బావ ఈ విషయంలో అంత ఉత్సాహం చూపటంలేదు కాబట్టి, నన్ను సహాయం చెయ్యమనీ శాంత కోరింది.

“శాంతా! నాకు తోబుట్టువుల్లేరు. నువ్వే నాసోదరివి. చిన్నప్పుడు మనంఅంతా ఒక కుటుంబంవాళ్లలాగే పెరిగేము. నీకు ఈ చిన్న విషయంలో సహాయం చెయ్యడానికి నన్ను కోరాలా?” అన్నాను.

రోజూ నాతో బీచికి రావడం, ఉత్సాహంతో తిరగడం శాంతకి కొత్త జీవితంలా కనిపించింది. విషాదచ్ఛాయలు ముఖాన్నుంచి పోయి ఏదో మార్పు కనిపిస్తూ వచ్చింది.

బావకి కొంచెం బాధగానేవుంది. నెమ్మది నెమ్మదిగా పేచీలోకి దింపాడు. ఓరాత్రి శాంతని గట్టిగా కోప్పడ్డాడట. నాస్నేహం వల్లకాదన్నాడట. అక్క మందలించబోతే “నీ మూలాన్నే ఇంతవరకూ వచ్చింది” అన్నాడట. ఇదంతావిని “ఏమంటావు? ముందు ఏమిచేస్తానంటావు?” అన్నాను శాంతతో.

“నేను స్వతంత్రంగా వుండి చదువుకోవాలని వుంది. నా సరూని వృద్ధిలోకి తీసుకువచ్చే భారం నామీద వుంది”

“నీవు వేరే ఉండటానికి అక్క ఏమంటుంది?”

“అక్క ఏమీ అనదు. మనం చెప్పినట్లే చేస్తుంది” అంది.

నాకూ శాంత స్వతంత్రంగా వుండి చదువుకుంటూ వుంటేనే మంచిదనిపించింది. ఏభయి రూపాయిలు యిస్తూ వకళ్లకి చాకిరీచేస్తూ వుండడం నచ్చలేదు. సరూవృద్ధి! బాంకులో డబ్బు సరూకి వుండొద్దా? ఏమో! ఈ బావల్ని ఎవరు నమ్ముతారు? ఆరోజే అక్కతో మాట్లాడేము. ఆమె కూడా ఒప్పుకుంది. జానకి బావతో ఈ విషయం చెప్పినప్పుడు, అతను సమ్మతించలేదట. పైగా ఏవేవో అనుమానాలతో మాట్లాడేడట. కాని మానిశ్చితాభిప్రాయం చెప్పేశాము. మేము, అక్కకూడా, పట్టుదలగా వుండడంవల్ల బావ ఏమీ అనలేక పోయాడు. శాంతని వనితా సదనంలో చేర్పించాను. సరూతో అక్కడే సుఖంగా వుంది. వాళ్ళందరితో కాలక్షేపం చేస్తూ విచారం మరిచిపోయింది.

రెండు రోజుల్లో నాప్రయాణం. శాంత నన్ను దిగబెట్టడానికి స్టేషనుకి వచ్చింది. సామాను సర్దడానికి నేను రైలులోకి ఎక్కాను, లోపల మావూరాయన, రెడ్డి ఆసామీ అనుకుంటూ—పలకరించాడు. ప్లాటుఫారంమీద వున్న శాంతవైపు నావైపు అనుమానంగాచూడ్డం మొదలుపెట్టాడు.

నేను సామాను సర్దుకుని ప్లాటుఫారం మీదికి దిగాను.

“మళ్లీ ఎన్నాళ్లకి దర్శనం” అంది.

“ఎన్నాళ్లోనా! వేసవి శలవల్లో”

“తప్పకుండా వస్తారా! ఇంటికి వెళ్లగానే మరచిపోతారా?

“అదేమిటి శాంతా! నిన్ను చూడకుండా వుండగలనా? శలవలు ఎప్పుడిస్తారా అని ఎదురుచూస్తూ వుంటాను.”

“మరి ఈసారి మీరు ఒక్కరేకాదు, సతీ సమేతంగా రావాలి. విడిచి ఉండలేరేమోకదూ? అంది కొంటెగా. మళ్ళీ ఇన్నాళ్లకి చూశాను ఆకళ్లల్లో కొంటెతనం. సదనంలో చేరినప్పటినుంచీ, వైధవ్య చిహ్నాలు క్రమ క్రమంగా అంతరించాయి శాంత ముఖంనుంచి. నాశాంత, నా చెల్లి, నిత్య శోభిని.

టైము అయింది. నేను రైలు ఎక్కాను. బండి కదిలింది. శాంత ‘నమస్తే’ అంది. ‘నమస్తే’ అన్నాను. సరూ ‘నమస్తే’ అంది. రైలు కదిలిపోయింది. శాంత అలాగే నిలబడిపోయింది.

రైలులోని రెడ్డి ఆసామీ ‘వాళ్లెవరండీ?’ అన్నాడు.

“మావాళ్లే” అన్నాను.



# స్త్రీలు—గడ్డం—మీసం!!!

శ్రీమతి కె. సుగుణమణిగారు

'ఆంధ్ర మహిళ' ప్రకటించిన పైశీర్షిక క్రింద వ్యాసం చూచేను. స్త్రీలకు గడ్డాలు, మీసాలు రావడానికి కారణం వేరు. కలియుగం కాదు; మన 'నవనాగరికత' చాలవరకు దీనికి కారణమని మనవి చేస్తున్నాను.

సృష్టికర్త గావించిన మానవ శరీర నిర్మాణం అత్యంత ఆశ్చర్యకరం. శాస్త్రజ్ఞానం పెరిగే కొద్దీ యీ నిర్మాణరహస్యం అర్థమవుతూ వచ్చింది. మూర్ఖులుగా ఉన్నవారిని తెలివి తేటలు గలవారిగను, కురూపులుగా నున్న వారిని సురూపులు గాను, స్త్రీని పురుషునిగాను మార్చ గలగటానికి ఈ శాస్త్ర జ్ఞానమే కారణమంటే కొందరు ఆశ్చర్య పడొచ్చు! మన మంతా అనుకోవడం ఏ వ్యక్తియొక్క జీవితంగాని, తెలివి తేటలుగాని, రూపం వగైరాలు గాని తల్లిదండ్రుల్ని బట్టి వంశా (Heridity) న్ని బట్టి ఉంటుం దనుకుంటాం. ఇదొక్కటే గాక, ఆవ్యక్తి ఏ వాతావరణంలో పెరిగేడో (Environment) అదికొంత, అంతకన్నా ముఖ్యం గా ఆవ్యక్తి శరీరంలో పనిచేసే కొన్ని నిర్వాహిక గ్రంథుల (Ductless endochrine glands) పనినిబట్టి ఉం టుందని శాస్త్రజ్ఞులు తెల్పేరు. ఈ నిర్వాహిక గ్రంథులు కొన్ని రకాల ద్రవాలు (Secretions) తయారుచేసి రక్తంలోకి పంపుతాయని, వీట్లలో "హార్మోన్సు" అనే కొన్ని విచిత్ర మైన రసాయినిక పదార్థాలు ఉంటాయని—ఇవి వ్యక్తుల ఎదుగు, ఆరోగ్యం, మానసిక ప్రవృత్తి వగైరాలేగాక, స్త్రీ పురుష లింగాలకు సహజంగా ఉండే కొన్ని ప్రత్యే కవిలక్ష ణాల (Secondary sexual characters) కు కారణ మని తేల్చేరు. Secondary sexual characters అంటే—శరీర నిర్మాణంలో ఒక్క లింగభేదాలేగాక, పురు షులకు-మీసాలు, గడ్డాలురావడం, పురుషస్వభావ గుణాలు కలగడం, స్త్రీలకు ఇవి రాకపోవడం, స్తనాలు, గర్భకోశం వగైరాలు వృద్ధికావడం ఇలాంటి స్త్రీ సహజగుణాలు కల గడంవంటి వన్నమాట.

నిర్వాహిక గ్రంథులు :— కంఠం దగ్గర 'థైరా యిడ్' గ్రంథి, దీనికి కొంచెంపైన 'పారాథైరాయిడ్' గ్రంథులు వున్నాయి. థైరాయిడ్ గ్రంథి తయారు చేసే ద్రవం 'థైరాక్సిన్' అనే రసాయనిక పదార్థంలో హారిదం (Iodine) అనే ధాతువు ఎక్కువగా ఉంటుంది. ఇది లోపిస్తే కంఠ వాపులు, (Goitre) అనే జబ్బు వస్తాయి. థైరాయిడ్ గ్రంథియొక్క ద్రవం శరీర కార్య క్రమం సరిగా జరగడానికి, ఆయాఅంగాలు సమిష్టిగా పని చేయడానికి కారణం అవుతుంది. పారా థైరాయిడ్ గ్రంథుల ద్రవం—యెముకలకు, రక్తానికి కావలసిన సున్నం సరఫరా సరిగా జరగడానికి కారణం. థైరాయిడ్ గ్రంథి యొక్క సారం (Thyroid extract) గనుక యీసురో అంటూ ఉండి, నిరుత్సాహంగా, 'స్త్రీ' అనటానికి తగిన గుణాలులేని వ్యక్తికి యిచ్చేమంటే—మామూలు మనిషి అవుతుంది. చవటకు, అసహ్యంగాఉన్న కురూపిబిడ్డకు యిస్తే కొంత తెలివితేటలు కలది, సురూపి అవుతుంది.

గర్భకోశంలో అండం, పిండం అయ్యేవరకు జరగవలసిన కార్యక్రమం అంతా సరిగా జరగాలంటే కొన్ని కొన్ని ద్రవాలు ముఖ్యావసరం. స్త్రీ శరీరంలో అండం పక్వమై గర్భకోశం చేరేక—కార్పస్‌లూటమ్ అనే కొత్త టిస్యూలు ఏర్పడతాయి. ఇది ఒక ప్రత్యేక హార్మోను యిస్తుంది. ఈ హార్మోను ఆయా భాగాలకు వెళ్ళి గర్భధారణ మైనవెనుక జరగవలసిన మార్పులన్నీ సక్రమంగా చేయిస్తుంది. ఈరెండు రకాల హార్మోనులు ఒకదాని తరువాత ఒకటి తయారై అండంనుంచి పిండం ఏర్పడ్డంలో ఉన్న మార్పు లన్నీ చేయిస్తాయి. వీటితో బాటు స్తనాల అభివృద్ధి వగైరా మార్పులన్నీ వస్తాయి.

శరీరావయవాలలో పనులన్నీ సరిగా జరగటానికి, ఈ హార్మోనులు ఏర్పడ్డం వగైరాలు నిర్ణయించేదియైన—ఇంకా ముఖ్యగ్రంథి ఉంది. ఇదే 'పిట్యూటరీ' గ్రంథి. దీని హార్మోను రక్తంద్వారా అండానికి చేరి పై హార్మోనుల ఉత్పత్తి కలిగిస్తుంది. ఈగ్రంథి బుర్రలో మస్తిష్కం అంగు ట్లోని కొండనాలుకకు పైన ఉంటుంది. ఈ పిట్యూటరీ ద్రవాన్నేలావుంది, హఠయోగులు అమృతం అంటారు.

వారు నాలుకను వెనక్కు మడిచి, ఈ గ్రంథి కిందకు చేర్చ గలిగేరంటే-ఎన్నాళ్లైనా ఆహార పానీయాలు లేకుండా ఉండ గలగటంలో ఉండే రహస్యం అంతా ఈ గ్రంథి యొక్క ద్రవంలో ఉంది. ఈ పిట్యూటరీ గ్రంథియొక్క ద్రవం శరీరంలో అన్ని భాగాల్ని నడిపించే కీలకమని అనొచ్చు. వ్యక్తులు పొడుగు ఎదగడానికి మర్మంకూడా ఈ ద్రవం లోనే ఉంది. థైరాయిడ్ గ్రంథి, ఇదీ సరిగా పని చేస్తేనే శరీరం సరిగా ఎదుగుతుంది. లేదా పొట్టివాళ్ళు తయారవుతారు. ఈ ద్రవాలు ఇంజక్షను యిస్తే పొట్టివారు పొడుగవుతారు. పిట్యూటరీ గ్రంథి గనుక ఎక్కువ పని చేయడం మొదలెట్టిం దంటే—ఆ వ్యక్తి తాడిలాగ ఎదుగుతుంది.

పిట్యూటరీ గ్రంథికి దగ్గరలో 'పైనియల్' గ్రంథిఒకటి ఉంది. దీని హార్మోనువల్ల శరీరం ఆయా లింగభేదాల కను గుణ్యంగా పెరుగుతుంది.

'సూప్రరినాల్' గ్లాండ్సు అని—మూత్ర పిండాల (Kidneys) దగ్గర ఉన్నాయి. ఒకబాలిక శరీరంలో వీటిమీద ఒక మాదిరి కంతి పెరిగింది. క్రమంగా అమ్మాయి అబ్బాయి అయ్యే గుణాలు—మానసిక పరివర్తనలోనే గాక శరీర లింగ భేదాలతో సహా—అభివృద్ధి కాజొచ్చాయి! దానిని శస్త్ర చికిత్సవల్ల తీసేస్తే మళ్ళీ అన్నివిషయాల అమ్మాయిగా మారింది!

లింగభేదాల్ని బట్టి ఆయా వ్యక్తులలో ఏర్పడే Secondery sexual characters కు కూడ ఈ నిర్వాహిక గ్రంథులు, వీటి హార్మోనులు సరిగా పని చేయడమే అని తేలింది. కొన్ని గ్రంథులు వయస్సునుబట్టి పరిపక్వమై శరీరావయవాలలో ఆయా మార్పులు తెస్తాయి. ఇది సృష్టికర్త నిర్మాణం.

ఇదిగాక నవనాగరికతా వ్యామోహం కూడా కొంత ఉంది. స్త్రీలు పసుపు ముఖానికేగాక శరీరాని కంతకీ వ్రాసుకొనే సాంప్రదాయం పెద్ద లేర్పరచారు. పసుపు సుమంగళి చిహ్నమేగాక కొంత రోమహారి గూడను. నవనాగరికతా వ్యామోహాలు యెక్కువై యిలాంటి చక్కటి సాంప్రదాయాల్ని పిచ్చిపనులని మానేసి—స్నోలు, ఫేసుపౌడర్లు అనే కొత్తపిచ్చిలో—పడితే స్త్రీలకు గడ్డాలు వస్తాయి! మీసాలువస్తాయి !!



## బుజ్జాయి చిత్రం

### అమ్మగారికి మీసం! అయ్యగారికి రోషం!



చిత్రకారుడు:

చిరంజీవి దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి

వయస్సు 11 సం॥

భర్త:

ఇదేమిటే, దయ్యం పట్టిందా? ఈ మీసాలెక్కడివి? ఈ క్రీప్ హైర్ ఏమిటి?

భార్య:

ఏంచెయ్యాను, చస్తానా? మీరు పౌరుషంలేక మీసాలు తీసేస్తే, మాకు పౌరుషంవచ్చి ఈ స్థితికి వచ్చాం!



నాది నాది నాది




నాది నాది నాది

# అమృతాంజనము

గాని,

" యథాయథా....................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా !, నీ కీర్తి ముల్లోకములను తెల్లఁజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, తెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాప మొందుచున్నది సుమా !!!

# మహిళా సంఘం, ఏలూరు

ఏలూరులో మహిళాసంఘం స్థాపించబడి నప్పటినుంచీ స్త్రీల యిబ్బందుల్ని తొలగించుతూ, వారిలో సంఘ చైతన్యం కలుగజేస్తూ వచ్చింది. మండు వేసంగిలో కూలీ

...ష్ట కావు.
...కొద్దీ నిల
...గ్యంగా
...ద్ద గుక్కె
...ల తెరబడి
...య్యాలు,
అవస్థలు
కట్టింది.
... రాయ
...చూచినా
...లో రెండు

...రు. స్త్రీ
శిథిలమై
...యిబ్బందిని
...సిపాలిటీ
...పేటల్లో
మహిళా

...కే ఒక
ముగ్గురు
అందు
...తమంది
ప్రసూతి
...నుం వీధి
...గించు
...డీడాక్ట
...రులపై
తెలియ

జేస్తూ ఒక మహాజరుతో రాయబారం నడిపింది. మునిసి పాలిటీవారు లేడీడాక్టరు దొరికిన వెంటనే నియమిస్తామని వాగ్దానం చేశారు.

స్త్రీల విజ్ఞానాన్ని పెంపొందించ డానికి మహిళా సంఘసభ్యులు రెండు పేటలలో పత్రికలు, వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలు చదివి వినిపిస్తున్నారు. పురుషులతో సమానంగా స్త్రీలకు ఆస్తిహక్కు ఉండాలనీ, వివాహ విషయంలో స్త్రీలకు జరిగే అన్యాయాలు పోవాలనీ వందలకొద్దీ స్త్రీలలో ప్రచారం చేశారు. రావుకమిటీ బిల్లులో సరియైన సవరణలు చేయాలని సంతకాలు చేయించారు.

—ప్రజాశక్తి.

మహిళాభ్యుదయానికి నిరంతర కృషిచేస్తూన్న ఏలూరు మహిళా సంఘానికి ఆంధ్రమహిళ అభినందనాలు.



" పునరాగమనం "

చిత్రకారిణి : ఆర్. సుజాత

హైదరాబాదు బాలికా పాఠశాల విద్యార్థిని.

ఆంధ్ర మహిళా సభ దసరా ఎగ్జిబిషన్‌లో బహుమానం పొందిన ఉత్తమ సిల్హౌట్ డ్రాయింగ్.



1-11-44

# “ప్రేమ లేఖ”

శ్రీమతి జి. ప్రభగారు

[పల్లెల్లో జరిగే సంగతుల్ని నాకు ఎప్పుడూ అందజేస్తూ పల్లె జీవితాన్ని కళ్ళ కందించిన మా నిర్మలకు నా అభివందనాలు—ఆమెకు క్షమార్పణతో ఈ లేఖను ప్రచురిస్తున్నాను.]

అక్కా,

క్రిందటి లేఖలో పల్లెల్లో పాలు పెరుగూ దొరుకుతవని ఎంతో పొగిడిరాశావు. పైగా మాయింటికొచ్చిన రెండు రోజులూ ప్రకృతిలో లీనమయ్యా నన్నావు. కాని, రెండ్రోజులు ఈ పల్లెల్లో ఉన్నట్టయితే, ఈ పల్లెలో మన స్త్రీల విషయం ఆలోచించినట్టయితే నీకు అర్థమవుతుంది.

పశు సంపదను గురించికదూ, నీవు మాట్లాడింది—ఈ పట్నాలు, వాటి సౌభాగ్యం కోసం ఈ కార్లు, జమీందార్ల కోసం. మా పల్లెల్లోంచి పిండుకుపోయే ప్రతి రక్తపు చుక్క మావి. ఆ రక్తపు చుక్కల్ని మీరు అనేక విధాలమార్చేసి, అనేక రంగులతో అనేక దినుసుల్లోంచి, పట్నంలో, మీ సౌఖ్యంకోసం ఉపయోగం చేసుకుంటున్నారు—దానికి ప్రతిఫలంగా మీరు మాకు ప్రసాదించే అమూల్య బహుమానాలేమిటి? ‘అవిద్య, మూర్ఖత్వం అవమానం’ ఇలాంటివి!

ఇదంతా ప్రభుత్వం మీద ఆధారపడిందంటావు. రాజకీయంగా మార్పు రావటానికి ఏంచేసారు? అధమపక్షం సంస్కరణన్నా చేయలేక మమ్మల్ని అనుభవిస్తూ, పై పెచ్చు మా పల్లెలపై కుళ్ళు నీళ్లు జల్లుతున్నారు!

మాకు పుల్ల లవసరంలేదు, మద్రాసులోలాగ కష్టంలేదు అన్నావు. పైగా పొగిడావు. మేం తయారుచేస్తున్న పిడకల్ని పొగిడావు బావుంది. పుల్లల్లేకుండా పొయ్యి మండదు—పిడకల్ని తయారుచేయటానికి ఎంత శ్రమ కావాలో తెలుసా? గొడ్లపాకలో నుంచి గోమయాన్ని ఎత్తాలి. ఓచోటికి పోగుచెయ్యాలి. వర్షానికి, ఎండకు కాపాడాలి. దోమలను ఆహ్వానించే గోమయం ఎంత అనారోగ్యకరమో ఆలోచించు. ఇదంతా చేర్చి దాన్ని బాగా కలియతొక్కాలి. ఆ తొక్కినదానిలో, ఊక కలపాలి—లేదా, వేరుశెనగ పొట్టు పోసి కలపాలి.

దాన్ని ముద్దలు చేయాలి—గోడలమీద, గుట్టల మీద చరవాలి. వానకు కాపాడుకోవాలి. ఇంత వెట్టి చాకిరీ ఉంది ఈ పిడకల్లో. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే ఇంత చాకిరీ చేసినా మా పిడకలకు ఖరీదులేదు!!

ఇంకో ముఖ్యమైన విషయం ఉంది! ఈ చాకిరీ అంతా ఎవరు చేస్తారు—అందరూ కామందులు కాదు. అందరికీ పాలేళ్లు ఉండరు. మధ్యతరగతి ఎక్కువ. ఆ మధ్యతరగతిలో మన తల్లులూ, అక్కలూ, మనమూ ఈ చాకిరీ చేసుకోవాలి. ఆలోచించు ప్రభా, ఈ శ్రమను మెదడుపై పరిశ్రమచేస్తే ఎంత అభివృద్ధి ఉంటుందో ఆలోచించు. విశాల దృష్టితో ఇలా చాకిరీకి జీవితాలు అర్పించేకంటే మనం మానసికంగా అభివృద్ధి పొందటానికి, ఆ కాలం, ఆ శ్రమ, అర్పించకూడదూ? బాగుపడ కూడదూ? ఈ తల్లులకు, పిల్లల్ని ఎలా సంరక్షించుకోవాలి? పిల్లల విషయంలో ఎలాంటి ఎలాంటి జాగ్రత్తలు తీసికోవాలి? అసలు తల్లుల బాధ్యత ఏమిటి? స్త్రీ ఏమేమి నేర్చుకోవాలి. అసలు స్త్రీజీవితవిధానంలో ఏలాంటి మార్పులను చెయ్యాలి, ఏలాంటి మార్పులను తెచ్చుకోవాలి......ఇలాంటి వెన్నో చేయవచ్చునే!

అధమపక్షం గృహాన్ని ఎలా ఉంచుకోవాలో తెలియని అధమ స్థితిలో ఉన్న మన స్త్రీలకు కనీసం జ్ఞానమన్నా యివ్వాలి. పత్రికలలోని విషయాలన్నా చెప్పాలి. అంత అభివృద్ధి పొందకపోతే,...కేవలం ప్రపంచ విచిత్ర చరిత్రలు, ఆచారాలు, అలవాట్లు, మతాలు, కట్టుబొట్లు, సాంఘిక మార్పులు, ఇంకా ఇంకా, అతివింత విషయాలూ, స్త్రీలకు విడ్డూరంగా ఉండేవీ, కూర్చొని వినటానికి ఎంతో కుతూహలంగా ఉండేవి ఎందుకు ప్రబోధించకూడదు...?

కాళీ ఉండదు!—ఎవరంటారు. ఈరోజు 18 గంటల్లో చూడండీ ఏంపని చేస్తారు—ఓ పదిమందిచేరి, ఆపిల్ల ఆలాంటిది, ఈపిల్ల ఇలాంటిది, దాని మగడు ఆలాంటాడు, దీని కొడుకు ఇలాంటాడు...అని ఎందుకు పనికిరాని కల్లబొల్లి కబుర్లకు పాడుచేసే నిర్మలమయిన కాలాన్న ఇలాంటి మంచి విషయాలు ఎందుకు తెలుసుకొని బాగుపడకూడదూ?

చదువుకున్న స్త్రీలూ, జీవితం సులభంగా గడుస్తున్న స్త్రీలూ, ఇంట్లో కూర్చొని చదువుకొని స్త్రీలకంటే అధ్వానంగా ఉండకపోతే, ఇలాంటి విషయాలను ఎందుకు తీసుకోకూడదూ?

అభివృద్ధి అభివందనాలతో
నీ నిర్మల.

# భోగం మేళాలు

మనవలెనే స్త్రీ అయివుండి—ఆ వ్యక్తి—మన ఎదుటనే, వుచ్చనీచాలులేకుండా—నానా అసహ్యకరమైన పాటలూ పాడుతూ—అభినయించడం అనేది, సునిశిత హృదయంగల స్త్రీ లెవ్వరూకూడా, సహించలేరు...అంతేకాకుండా అటువంటి స్త్రీ తన సోదరులనూ, కుమారులనూ, భర్తనూ అధోగతికి దింపటానికే ప్రయత్నమైన—భోగం మేళాన్ని—హృదయంవున్న యే స్త్రీకూడా సహించలేదు.

దీర్ఘంగా ఆలోచించిన, ప్రపంచజ్ఞానంగల పురుషులెవ్వరూ—ఈ భోగం మేళాలకు, ఒప్పుకోడంగాని గౌరవించడంగాని, జరగదు.

ఇటువంటి పరిస్థితులు—వుత్సాహం- కార్యదీక్ష వున్నవాళ్లు—యింకొంచం ముందుకువెళ్లి, ఆ భోగం మేళాలు అనేవాటిని నాశనం చెయ్యాలనుకున్నారు. సమాజ శ్రేయస్సుకోసం ఈ విధంగా చేసేపనికి చాలామంది తోడ్పడుతున్నారు. మిగతవారు తోడ్పడుతారనే విశ్వాసంకూడా వుంది...!

తూర్పు గోదావరి జిల్లాలో అన్నీ అని చెప్పుకుంటానికి వీలులేకపోయినా—దాదాపుగా చాలా మేళాలను మాన్పించగల్గారు—ప్రజాసానుభూతితో.

కాకినాడలో ఒక సంఘటన జరిగింది. భోగం మేళాలు పెట్టడం అనేది వినాయక చవితికి-ఒక ఆచారంగా పరిణమించింది. ఈ ప్రచారకుల ఫలితంగా, చాలామంది మేళాలను పెట్టడం మానుతున్నారు.

మేళాలు చేసేవాళ్లలో కొందరు—విజ్ఞానం లేకపోవడం చేత, మొండి పట్టుదలవల్ల, కాకినాడ మొత్తంమీద, ఒక మేళం సెట్టు మేళం చేయటానికి తయారయింది. ఎంతసేపు నచ్చచెప్పినా లాభం లేకపోయింది. తెలివికల కొందరు సత్యాగ్రహం చెయ్యమన్నారు.

సరే! వెంటనే పిలుపుయిచ్చారు—సత్యాగ్రహానికి. తప్పని తెలుసుకుని మేళం మానివేసినవారు, మేళాలు చేయకపోయినా అభిమానం కొద్దీ కొందరు—శ్రీమంతులైవుండి కూడా అభిమానం కొద్దీ దువ్వ రాజేశ్వరిగారు—వుత్సాహంగా పాల్గొన్నారు. మేళం చేస్తాం మానేవరకు—అక్కడే వుంటానికి సిద్ధపడ్డారు. కొంచంసేపు గడిచింది.

గాంధీజీ చెప్పినట్లు సత్యాగ్రహానికి అపజయం అనేది లేదు. నెమ్మదిగా వాళ్లల్లో మార్పు వచ్చింది. తమ కొద్దిమంది మూర్ఖత్వంకోసం అంతమంది సత్యాగ్రహం చెయ్యటం—వాళ్లకి హృదయ పరివర్తనాన్ని కల్గించింది. "మేళాలు చెయ్యం" అని వొప్పుకుని మానేశారు.

నర్సాపురం (ప. గో. జిల్లా)లో దసరాకి దేవీ నవరాత్రులు బాగా చేస్తారు. కాని భోగం మేళం తెచ్చే ఆచారంలేదు. ఈ సంవత్సరం రెండు దేవాలయాల ట్రస్టీలకే వున్నట్టు వుండి—పెరుగు ముంతపాట, నిప్పుకూడెదపట్టి, ఏల్లొడి పాట వినాలని బుద్ధి పుట్టిందో—దేముడికే బుద్ధిపుట్టి, కలలో కనిపించి చెప్పాడోగాని మేళాలు మాత్రం తెచ్చారు.

ట్రస్టీలు సామాన్యులనుకున్నారా, తెలివిగలవారే, మర్యాదస్తులు, బుద్ధిమంతులు, పెద్దమనుష్యులు—ఆ వూళ్లో పేరు ప్రతిష్టలు గలవారు.

మరి, నర్సాపురం, "మేళాలను మాన్పించే" వుద్యమానికి పట్టుకొమ్మ. తమవూరు—గుడికోసం మేళం అనే విషయాన్ని, సహించ లేకపోయారు. మానాభిమానాలు వున్నవాడెవడూ సహించడు కూడాను...

భాస్కర్ల హేమచంద్ర భాస్కరరావు, మరికొందరూ "మేళాలు మానండి" అనే కరపత్రాలు తీసుకొని వెళ్లారు. వాటిని ప్రజలకూ—మేళం చేసేవాళ్లకూ—ట్రస్టీలకూ, పంచిపెట్టారు. మేళం ఆడేవాళ్లకు వాళ్లు చేస్తున్న తప్పపనిని గురించి చెప్పారు. మేళంకన్న చక్కటి పాటకచ్చేరీ ఎంత బాగుంటుందో చెప్పేందుకు తమలోనే వకరు చక్కగా పాడి వినిపించారు.

ఈ పనంతా ట్రస్టీలకు, రౌడీజంగా, యింకా యేదేదోగాతోచింది. మేళం ఆడేవాళ్లలో కొందరు తప్పు తెలుసుకుని ఎప్పుడూ చెయ్యం అనికూడా అన్నారు. కాని ట్రస్టీలకు...

చెడిపోతున్నవాళ్లను బాగుచెయ్యటం మానవత్వం అనిపించుకొంటుంది. బాగుపడేవాళ్లను—చెడగొట్టాలనటం—"పశుత్వం." కాదు, కాదు, పశువులుకూడా తమలో చేర్చుకోవు.

మేళాలు నాశనం అయినందువల్ల లాభం—ప్రజలందరికీ చెందుతుంది. అవి నాశనం అవ్వాలీ అంటే...? ప్రజా సహాయం అవసరం. ప్రజా సహాయం వున్నప్పుడు మాత్రమే—ప్రజా వినాశకరమైన—మేళాలను ఆపగల్గటం అనే విషయాన్ని ప్రజలెవ్వరూ మరచిపోరనుకుంటా.

—రమాకాంత్

# త్యాగమూర్తి పన్నా

శ్రీ జి. కోటయ్యగారు, (జాతీయ రచనా మండలి.)

పవిత్రమైన భారతభూమిలో ఎందరెందరో వీరమాతలు, త్యాగమూర్తులు, దేశసేవా పరాయణులు—స్వామిభక్తులు జన్మించి తమ కీర్తి దశదిశల వ్యాపింపజేసి కాలగర్భంలో లీనమై పోయినారు.

అట్టి స్వామిభక్తి పరాయణులలో, త్యాగమూర్తులలో లెక్కింప నర్హతపొందినది రాణా సంగ్రామసింహుని జనానాలో దాసీగా పనిజేసిన "పన్నా" ఒకర్తె.

మేవాడ్ రాజ్యాధిపతియైన రాణా సంగ్రామసింహుడు, తన అవసానకాలమందు ప్రధానమంత్రిని తన కుమారుడైన యువరాజా ఉదయసింగ్ తరఫున మేవాడ్ రాజ్యము నేలుటకు రీజంటుగా నియమించి చనిపోయెను.

తలవని తలంపుగావచ్చిన యీ వున్నతపదవి ప్రధాని హృదయంలో దురాశ మొలకలెత్తింపజేసినది. యువరాజైన ఉదయసింహుని చంపి మేవాడ్ రాజ్యానికి తానే రాజై పరిపాలించవలెనని యువ్విళ్ళూరుతూ-యువరాజును చంపుటకు అతడు వ్యూహము పన్నుచుండెను.

రాజవంశమునకు తాతముత్తాతలనుండి సేవజేయుచున్నటువంటి కుటుంబమునకుజెందిన దాసీ పన్నాయొక్క రక్షణలో యువరాజు ఉదయసింహుడు పెరుగుచుండెను. పన్నాకు యువరాజు వయస్సుగలిగిన కుమారుడొకడుండెను. వీళ్లిద్దరిని పన్నా ఎంతో జాగ్రత్తగా పెంచుచుండెను. పన్నా తాతలు తండ్రులు రాజకుటుంబమునకు సేవజేసి తమ స్వామిభక్తిని అనేకరీతుల వెల్లడించిరి. ఆ వంశమునకుజెందినదే పన్నా.

యువరాజు తరఫున రాజ్యపాలన చేయుచున్న మంత్రి ఒకరోజురాత్రి ఉదయసింహుని తనంతటతానే చంప నిశ్చయించుకొనెను. ప్రధానమంత్రితో ఎక్కువ చనువుగా మాట్లాడుతూ అతని మంచిచెడ్డలు తెలుసుకొనుటలో నేర్పరియైన ఒక మంగలి యీ విషయమునంతను ముందుగా తెలుసుకొనెను.

ఆ రాత్రి ప్రధానమంత్రి ఉదయసింహుని చంపుటకు వచ్చే సమయంలో మంగలి రాజప్రాసాదంలో పన్నావున్న స్థలమునకు హఠాత్తుగా వచ్చెను.

ప్రశాంతమైన ఆ నిశాసమయంలో పన్నా రక్షణలో యువరాజు ఉదయసింహుడు హాయిగా నిద్రించుచుండెను. అతనికి దగ్గరలోనే అతని వయస్సుగలిగిన పన్నాకుమారుడు కూడా గాఢనిద్రలో వుండెను. పన్నా యీ బిడ్డల నిద్దరను జాగ్రత్తగా కనిపెడుతూ ఏదో కుట్టుపని చేసుకొనుచున్న సమయంలో హఠాత్తుగా మంగలి ఆ అర్ధరాత్రివేళ అచ్చటకు వచ్చుటజూచి పన్నా ఆశ్చర్యచకితయైనది.

ఇంకొక గంటలో జరుగబోవు యువరాజు హత్యను గూర్చి చెప్పి ఎట్లయినను యువరాజును కాపాడి తన స్వామిభక్తిని నిలుపవలసినదని మంగలి చెప్పెను. వెంటనే పన్నా నిద్రపోవుచున్న యువరాజు ఉదయసింహుని మాసిన బట్టలలో చుట్టి, చూసినవారికి అనుమానము కలుగకుండా ఒక బుట్టలో పెట్టి, యువరాజును రహస్యముగా దాచిపెట్టవలసినదనిన్నీ—యువరాజుకు బదులుగా తన కుమారుని హంతకునిచేతి కందించెదననిన్నీ చెప్పి మంగలిచేతి కాబుట్టను యిచ్చి పంపివేసెను. పన్నాయొక్క త్యాగమునకు మంగలి దిగ్భ్రమజెందెను.

మంగలి వెళ్లిపోగానే నిద్రపోవుచున్న తన కుమారునికి యువరాజు దుస్తులుతొడిగి యువరాజు నిద్రించు స్థలములో తన కుమారుని పరుండజేసెను. ఒక్కసారి ముద్దిడుకొని "తండ్రీ—నీమేని రక్తస్రవంతులచే యీ మేవాడు రాజవంశపుమొలకను పెంచి మహా వృక్షముగాజేయ సంకల్పించితిని" అని తన కుమారు నచ్చట పరుండబెట్టి—యువరాజును చంపుటకు వచ్చిన హంతకుని కరవాలమునకు రాజదుస్తులలోవున్న తన కుమారుని అందించి చిరస్మరణీయురాలయ్యెను. పన్నా ఇప్పటికీ రాజస్థానంలో ప్రతి ఇంటా స్మరించబడుతూ వుంటుంది.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by Raghuvaradayalu Misra at the Hindi Prachar Press,
12, Thanikachalam Chetty Road, T'nagar, Madras.

